REGD. No. RNL 18 ESTD 1930 10-5-1991 శుక్రవారం రూ. 1-50 పై

# జమీన్‌రైతు

సంపుటి: 62 సంచిక: 19 స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్

ఒంగోలు నియోజకవర్గ కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేస్తున్న

శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డిగారిని

అత్యధిక మెజారిటీతో గెలిపించ ప్రార్థన

రాపేరియన్ డి. సి. హరిబాబు

## కాంగ్రెస్ తుఫానులో మరొకసారి తెలుగుదేశం తీన్తారుకానున్నదా?

# రాజీవ్‌కే ఆశ్చర్యంగొలిపే గెలుపు?

(హైదరాబాదు వార్తాకథనం)

రాష్ట్రంలో ఎన్నికల ఫలితాలపై ఇటు తెలుగుదేశం, అటు కాంగ్రెసు పార్టీలు రెండూ ఎంతో ఆశావహంగా వున్నాయి. ఎవరికివారు మెజారిటీ సీట్లు మావేనన్న నమ్మకంతో నిశ్చింతగా వున్నారు. తమ మనసులోని అభిప్రాయం ఏమాత్రం వెల్లడి కాకుండా రాజకీయపార్టీలను అయోమయంలో పెట్టడంలో భారతీయ ఓటర్లు ఎంత పరిణతిచెందారో తెలుసుకోవడానికి ఈనాడు రాష్ట్రంలోని నెలకొనివున్న పరిస్థితే అద్దంపడుతున్నది. ఎన్టీ రామారావు సభలకు జనం వస్తున్నారు; కాంగ్రెసు అభ్యర్థులువెళ్ళితే ఘనంగా స్వాగతిస్తున్నారు; బిజెపి నాయకులు పోయినా సావధానంగా వింటున్నారు. ఓటరికి ఎవరికి ఓటు వేస్తారో మాత్రం బయటకు కన్పడకుండా జాగ్రత్త పడుతున్నారు.

కోస్తా, రాయలసీమల్లోని కొన్ని ప్రాంతాలలో ఈపరిస్థితిలేటతెల్లంగా కన్పడుతున్నది. కడప, కర్నూలులలో వి. పి. సింగ్, ఎన్. టి. ఆర్, కలిసి ప్రసంగించిన సభలు జనసమ్మర్దంతో కిటకిటలాడాయి. అదిచూసి రాయలసీమ అంతా తన ప్రభంజనం వీస్తున్నదని ఎన్. టి. ఆర్. ప్రసన్నుడు అయితే, ఆ వెంటనే డాక్టర్ వై ఎస్ రాజశేఖరరెడ్డి పర్యటనకువెళ్ళితే ప్రజలు ఘన నీరాజన మర్యాదాదు ఉత్తరాంధ్ర పరిస్థితి అంతే. ఎన్టీ ఆర్ చైతన్యరథం జనసముద్రాల నీదుకుంటూ సాగిపోయిందని దినపత్రికలు ఘనమైన వర్ణనలు చేశాయి. ఆ వెంటనే ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి పర్యటించిన సభలకూ ప్రజలు వేలంవెర్రిగా వచ్చారు. ఈ పరిస్థితులలో ప్రజాభిమానం ఎవరి పక్షానవుందో అంచనా వేసేదెట్లా! అందువల్లే ఎవరూ సాహసించి ఫలితాలపై అంచనాలు ప్రకటించలేక పోతున్నారు.

పోలింగ్ తేదీ దగ్గరపడేకొద్దీ రాజధానికి చేరుతున్న వార్తలనుబట్టి 1989 నాటి పరిస్థితికి, ఇప్పటికీ పెద్దతేడావుంటే అవకాశంలేదని పరిశీలకులు అభిప్రాయపడు

—తరువాత 6వ పేజీలో

### తాను పోతే మజ్జిగకు గతిలేదు...

తానుపోతే మజ్జిగకు గతిలేదు పెరుగుకు చీటీ పంపాడన్నట్లుగా వుంది చంద్రశేఖర్ జనతాదళ్ వ్యవహారం. ఆయన 8 తేదీ రాష్ట్ర పర్యటనకు వస్తే నాలుగుచోట్ల అసలు సభలు రద్దుచేసుకోగా, మిగతాచోట్ల ఆయన సభలకు మూడునాలుగు వందల మంది కూడా జనంరాలేదట. ఆ పార్టీమాత్రం రాష్ట్రంలో 84 స్థానాలకు పోటీ చేస్తున్నది.

సిగ్గు! సిగ్గు!!

Dr.C.V.RAMAN College of Sciences

డా. సి. వి. రామన్ కాలేజి ఆఫ్ సైన్సెస్

వి.ఆర్. కాలేజి దగ్గర-నెల్లూరు

ఫోన్ : 23367

**1989-90 విద్యాసంవత్సరము నుండి అమలులోవున్న ఇంటర్‌మీడియెట్ పరీక్షాపత్రముల గురించి విద్యార్థులకు కొన్ని ముఖ్యవిషయములను తెలియజేయుచున్నాము.**

దాదాపుగా ఛాయిస్ లేనటువంటి ఈ నూతన ప్రశ్నాపత్రములను పూర్తి స్థాయిలో ఎదుర్కొనుటకై విద్యార్థులంతావిస్తాయిలో కృషిచేయవలసి వుంది.

గతంలోవలె మూడు నాలుగు నెలల శిక్షణ వలన విద్యార్థులకు ఎటువంటి ప్రయోజనం వుండదు.

కేవలం స్టడిమెటీరియల్ లేదా మోడల్ పేపర్స్‌కు పరిమితమవడం ఆత్మహత్యాసదృశమవుతుంది.

Text Book ఆమూలాగ్రం చదివినా నూరుశాతం మార్కులు సాధించుటకు యింకా చాలాకృషి, శిక్షణ అవసరమవుతుంది.

పై విషయములను దృష్టిలో వుంచుకొని, విద్యార్థులకు గరిష్ట స్థాయిలో ప్రయోజనం చేకూరే విధంగా శిక్షణ ఇవ్వడమే మా ప్రత్యేకత మారిన ప్రశ్నాపత్రమునననుసరించి మొదటినుండి అందుకనుగుణంగా శిక్షణనిస్తూ, విద్యార్థులు పరీక్షలను ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొనుటకు తగిన కృషి చేయగలమని హామీ యిస్తున్నాము.

| | | | | |
|---|---|---|---|---|
| సీనియర్ ఇంటర్ | మొదటి బ్యాచ్ | 23-5-91 | రెండవ బ్యాచ్ | 3-6-91 |
| జూనియర్ ఇంటర్ | మొదటి బ్యాచ్ | 23-5-91 | రెండవ బ్యాచ్ | 3-6-91 |

- బాలబాలికలకు విడివిడిగా హాస్టల్ వసతి కలదు.
- వారంవారం క్రమంతప్పకుండా పరీక్షలు నిర్వహించి తల్లిదండ్రులకు ప్రోగ్రెస్‌ను తెలియజేయగలము.

K. MADHUSUDHANA REDDY MSc (ons.)
Director




**ONIDA** CTV/VCR
**SOLIDA'RE**
CTV/B & W TV
**BUSH**
CTV/B &W TV
Authorised Dealers :
Sales & Service
Phone : 25994

**SRIDEVI AGENCIES**
Near Corporation Bank,
Trunk Road, Nellore 524 001.

వ్రిభుత్కోద్యోగులకు సులభ వాయిదాల పద్ధతిపై ఏర్పాటు చేయబడును






Distinction in Marks is Common Place with us.
Distinction in District Exams Common and Public is our Aim
District First and Second in English Medium are our Proud Students.
Distinguishing our School is up to you,
HENCE
A School with a Difference is Modern School
For Admissions Into Toddler to Tenth Class
Any Day is a Good Day From Now.




# శాసనసభ్యులమీద ప్రజల విశ్వాసానికిపరీక్ష ఈఎన్నిక!

నెల్లూరు పార్లమెంటు నియోజకవర్గంలో కాంగ్రెస్ ప్రచారం నిరుత్సాహజనకంగా ఆవేదనాపూరితంగా వుందని కార్యకర్తలు, అభిమానులు లబోదిబో మంటున్నారు. నెల్లూరులో ఈ వారంలో శ్రీమతి నన్నపనేని రాజకుమారి సరి, టి. రాం. అధ్యక్షుడు, శాసనసభ్యుడు, మరికొందరు నాయకులతో కొన్ని ప్రాంతాలలో జరిగిన నిశ్శబ్దపు ప్రచారం; ఎక్కడో ఒక గోడ మీద పద్మశ్రీకే ఓటు అని వ్రాయబడిన నినాదం; రెండు రోడ్ల వెంకొంప్పబడిన రాజీవ్ - జనార్ధనరెడ్డిగారల భారీకటౌట్లు తప్ప, ప్రజలదృష్టిని ఆకర్షించే కార్యక్రమం ఏదీ చేపట్టబడలేదు. నెలరోజుల ముందు అతికించబడిన రాజీవ్‌గాంధీ వాల్ పోస్టర్లు ఎప్పుడో అడుగునపడిపోయాయి. వాటిని ముందుగా అతికించి నిరుపయోగం చేశారు. టవున్ లో, టవున్‌లోనే గాదు పల్లెల్లోసైతం బి.జె.పి.కి పోను ఒక్క గోడ ఖాళీగా మిగిలిలేదు. బి.జె.పి. వారి రామభక్తి ఎంత గాఢమైనదంటే, కొన్ని గ్రామాల్లో రామాలయాలకు శుద్ధంగా సున్నంవేసి పార్టీనినాదాలు వ్రాసేశారట! కాంగ్రెస్‌జెండా, కాంగ్రెస్ అభ్యర్థిని పేరు పత్రికలలోతప్పఎక్కడాకనిపించడంలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే బయట మామూలు మనిషి కండ్లకు కాంగ్రెసే కనపడడంలేదు, వినబడడంలేదు.

పోలింగ్‌కు ఒకటిన్నరవారంమాత్రమే వ్యవధివుంది, అయినా కాంగ్రెస్ నాయకులకు చురుకెక్కకపోవడం విచిత్రంగానే వుంది. ఎస్. సి. సీటు కావడంవల్ల శ్రద్ధ చూపడంలేదనే వ్యాఖ్యలు విమర్శలు వస్తున్నాయి. అభ్యర్థికొత్త; తెలుగుదేశంవారిది తెల్లవారిపట్లున్నా. బి.జె.పి వారి ఆర్భాటం ఎక్కువగా వుంది ఆర్భాటానికి, ఓట్లకు సంబంధం వుంటుందని మా అభిప్రాయంకాదు; కాని దాని ప్రభావం సామాన్యుల మనసుమీద పడితీరుతుంది. ప్రచారారంభంలో ఎవరు వెనుకబడతారో, ప్రజల్లోకూడా ఆ పార్టీ వెనుకబడి వుందనే అభిప్రాయం ఏర్పడుతుంది. కాంగ్రెస్‌కు సంబంధించి ప్రస్తుతం పరిస్థితి నిర్లక్ష్యంగా, నిస్తేజంగా వుందనే చెప్పాలి.



కుమారి పద్మశ్రీ

> **కుమారి పద్మశ్రీ**
> **70వేల మెజారిటీతో**
> **గెలిస్తేనే**
> **ఎం. ఎల్. ఎ. లకు**
> **పరువు, ప్రతిష్ఠ!**

ఈ పార్లమెంటు నియోజకవర్గాల్లోని ఏడు అసెంబ్లీ స్థానాలూ కాంగ్రెస్‌వే. ఏ శాసన సభ్యుడు ఆ అసెంబ్లీ నియోజక వర్గం బాధ్యత వహిస్తే, ఈ పది రోజులైనా తన నియోజకవర్గం హద్దులు దాటి బయట కాలుపెట్టకుండా నిర్విరామంగా పనిచేయగలిగితే, కాంగ్రెస్ మీద వున్న అభిమానాన్ని ఓట్లరూపంలోకి మార్చుకొనుటకు అవసరమైన ఏర్పాట్లన్నీ చేయగలిగితే పార్లమెంటు కాంగ్రెస్ అభ్యర్థికి అఖండవిజయం చేకూరుతుంది. శాసన సభ్యులు ఆ ప్రయత్నంలో వున్నారా? పట్టుదలతో వున్నారా? వారికి కావలసిన సహాయ సహకారాలు అందుబాటులో వున్నాయా? ఏడు నియోజకవర్గాల సమన్వయ బాధ్యత ఎవరిది?

ఏడుగురు శాసన సభ్యుల్లో ఒకరు చేతులెత్తేసి, ఎన్నికలు పూర్తి అయ్యేవరకు అడుగుపెట్టనని శపథం చేసి హైదరాబాదుకు చెక్కేశాడు. ఆయన ప్రాతినిధ్యం

—తరువాయి 8 పేజీలో


## శుభాకాంక్షలు



ప్రారంభించిన అనతికాలంలోనే అందరి అభిమానం పొంది
10-5-91 తేదిన ద్వితీయ వార్షికోత్సవం జరుపుకుంటున్న

## శ్రీ భారత్ బిల్డర్స్

సాయిబాబా కాంప్లెక్స్, రమాకాంత్ లాడ్జి ప్రక్కన
ట్రంకురోడ్డు - నెల్లూరు.

భాగస్తులు : శ్రీ ఎస్. గంగాధర్. శ్రీ ఎన్. శ్రీధర్,
శ్రీ టి.వి.ఎస్. చలపతిరావు గార్లకు
మా హృదయపూర్వక శుభాకాంక్షలు

1. శ్రీ సాయి కన్‌స్ట్రక్షన్స్ & కన్సల్‌టెంట్స్ 2. శివసాయి కన్‌స్ట్రక్షన్స్
3. నాగసాయి కన్‌స్ట్రక్షన్స్ 4. బొమ్మిశెట్టి వీరరాఘవులు & అదర్స్
5. ఎస్.ఎస్. వి. రామమోహనరావు (బాబు) 6. నూనె ఆదిశేషయ్య
7. డి. కన్నయ్య.





## దుగర్ ఇన్వెస్టుమెంట్సు లిమిటెడ్

రిజిష్టర్ ఆఫీసు 805
మౌంటురోడ్డు, మద్రాను-2

## దశాబ్ది వార్షికోత్సవాలు

మే 20 తేదీన మా కంపెనీ 11వ సంవత్సరంలో
అడుగిడుతున్న సందర్భంలో
**మా బ్రాంచీలకు విచ్చేయండి!**
**మా ప్రత్యేక సేవలు అందుకోండి!!**
మా వద్ద ఇన్‌స్టెంట్ ఇంటరెస్ట్ స్కీములో డిపాజిట్ చేయండి
వెంటనే మొత్తము పీరియడ్‌కు వడ్డీనితీసుకోండి. వేరెక్కడా
లేని ఈ అవకాశం ఒక్క దుగర్ ఇన్వెస్టుమెంట్సు లిమిటెడ్‌లో
మాత్రమే కలదు.

**డా॥ సి. అన్నారావు** — చైర్మన్
**ఎన్. తారాచంద్ దుగర్** — మేనేజింగ్ డైరెక్టర్

**బి. సాయిమోహనకృష్ణ**
బ్రాంచి మేనేజరు
దుగర్ ఇన్వెస్టుమెంట్సు లిమిటెడ్
17/115, ట్రంకురోడ్డు
నెల్లూరు ఫోన్ : 27578

**యం. తిరుపాలు**
బ్రాంచి మేనేజరు
దుగర్ ఇన్వెస్టుమెంట్సు లిమిటెడ్
దుగర్ హౌసు, ఫోన్ : 880
8/86, రాజావీధి, గూడూరు

80 సంవత్సరాలుగా నమ్మకమే పునాదిగా ఆర్థికవ్యాపారంలో అనుభవం గల వారిచే నడుపబడుచున్న సంస్థ గత 8 సంవత్సరాలుగా 25% డివిడెండు 12 నెలలకు చెల్లిస్తున్న సంస్థ

# జమీన్‌రైతు

## బీహార్ ఘోరం

మేహం ఉపఎన్నికద్వారా ఓం ప్రకాష్ చౌతాలా భారత ప్రజాస్వామ్యానికి తీరని అపఖ్యాతి ఆర్జించిపెడితే, తన అరాచకధోరణుల ద్వారా ఎన్నికల వ్యవస్థనే అపహాస్యంపాలుజేస్తున్నాడు శ్రీ లల్లూ ప్రసాద్ యాదవ్. బీహార్‌లో గత రెండు వారాలుగా జరుగుతున్న సంఘటనలు ప్రజాస్వామ్యంపై నమ్మకమున్న ప్రతివాడికీ హృదయ వేదన కల్గిస్తున్నాయి.

మాఫియా ముఠాలు, గూండాలు, బందిపోట్ల అరాచకానికి బీహార్ ఎప్పుడూ పెట్టింది పేరే! ప్రతి రాజకీయవాదికీ ఏదో ఒక మాఫియా గ్యాంగ్‌తో సంబంధం వుండితీరుతుంది. ఎన్నికల్లో వారి సహకారం లేకుండే చాలామంది రాష్ట్ర నాయకులకు డిపాజిట్లురావు. రిగ్గింగు, బూత్ స్వాధీనం, బ్యాలెట్ పెట్టెల అపహరణ, హత్యలు, పోలింగ్ కేంద్రాలపై బాంబుదాడులు వారికి సర్వసాధారణం. అన్ని పార్టీలవారికీ ఇది మామూలే!

బీహార్ ముఖ్యమంత్రి శ్రీ లల్లూప్రసాద్ యాదవ్ ఈ సారి ఈ అరాచకాన్ని వ్యవస్థీకృతం చేయబోతున్నారు. నరహంతకులైన తమపార్టీ కార్యకర్తలను ఎంపికచేసి, హోంగార్డులుగా నియమించి, 60 వేల పోలింగ్ బూత్‌లను వారికప్పచెప్పడానికి ఆయనొకపథకం వన్నారు. వీరెంతటి దుర్మార్గులో పోలింగ్‌కు ముందే స్పష్టమైపోయింది. పాట్నానగరంలో, పోలీసుల కళ్ళయెదుట, హోంగార్డు యూనిఫారంతో వీరు అంగళ్ళపైబడి దోపిడీలు చేశారు; ప్రజలను చితకదన్నారు. రాష్ట్రంలో పర్యటనకువచ్చిన బిజెపి నేత శ్రీ ఎల్.కె. అద్వాని, కాంగ్రెస్ నాయకుడు శ్రీ రాజీవ్ గాంధీలపై దాడికి ప్రయత్నం చేశారు. వారి ఎన్నికల సభలను దౌర్జన్యపూరితంగా భగ్నంచేశారు. ఇటువంటి గూండాలచేతికి పోలింగ్ బూతులు అప్పచెప్తే ఏమిజరుగుతుంది?

కాంగ్రెస్, బిజెపి, జనతాదళ్ (ఎస్) పార్టీలు మూడూ ముక్తకంఠంతో ఈ దౌర్జన్యాలను నిరసించాయి. కేంద్ర హోం మంత్రిత్వశాఖ అధికారులు రాష్ట్రంలో పర్యటనజరిపి పరిస్థితి ప్రమాదకరంగా వుందని నివేదిక సమర్పించారు. చివరకు బీహార్ గవర్నర్ సైతం రాష్ట్రంలో స్వేచ్ఛగా, న్యాయంగా ఎన్నికలు జరిగే అవకాశం లేదని రాష్ట్రపతికి విన్నవించాడు.

ఈ గూండాయిజమేకాదు- ఇ.కొకప్రక్క చేపల చెరువుల వేలం రద్దువంటి నిర్ణయాలద్వారా బీహార్ ముఖ్యమంత్రి ఎన్నికల నియమాలను విచ్చలవిడిగా ఉల్లంఘిస్తున్నాడు. ఎన్నికల కమీషన హెచ్చరికలను ఆయన ఖాతరుచేయలేదు. ఆ రాష్ట్రంలో ప్రభుత్వాన్ని రద్దుచేసి కేంద్ర పాలన విధించడమా లేక ఎన్నికలే రద్దుచేయడమా అని తర్జనభర్జన పడవలసిన తీవ్ర ఆందోళనకర పరిస్థితి ఏర్పడింది. ఇవిరెండూ సాంప్రదాయ విరుద్ధచర్యలే. కాని ఆ రాష్ట్రంలోని పరిస్థితులంతగా విషమిస్తున్నాయి. ఎన్నికల కమీషన రకరకాల మార్గాలలో రాష్ట్ర ప్రభుత్వాన్ని నియంత్రించడానికి ప్రయత్నించి విఫలమై- చివరకు హోంగార్డులను పోలింగ్ బూతులలో నియమించరాదని నిషేధం విధించి ప్రతిపక్షాల ఆందోళనను ఉపశమింపజేసింది. కేంద్ర సైనిక సిబ్బందితో ఆ రాష్ట్రంలో ఎన్నికలు జరగనున్నాయి.

లల్లూప్రసాద్ యాదవ్ వ్యక్తిగతంగా అతి నిరాడంబరుడు. ఆయన నివాసం ఇప్పటికీ చౌకీదార్ల క్వార్టర్‌లోనే. ముఖ్యమంత్రి నివాసంలోని ఆడంబరాలకంటే, మురికివాడ ప్రజలతో సహజీవనం పట్లనే ఆయనకాసక్తి. వ్యక్తిగతజీవితం ఎంత ఆదర్శప్రాయమైనదో, రాజకీయ దినచర్య అంత రాక్షసయుతంగా వుండడం విచిత్రం. రాజకీయ విలువలపట్ల ఇర్లెక్కి కేకలుపెట్టే వి. పి. సింగ్ బీహారు కొచ్చేసరికి లల్లూ యాదవ్‌ను వేనరతుగా సమర్థిస్తాడు. సింగ్ గారి అసలు స్వరూపం ఈ రాష్ట్రంలో నగ్నంగా వెల్లడౌతున్నది.

నీతులు వల్లించే సి. పి. ఎం. నాయకుడు శ్రీ జ్యోతి బసు సైతం పశ్చిమ బెంగాల్‌లో ఎన్నికల నియమాలను గాలికివదలి ప్రవర్తిస్తున్నాడు. ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్‌లుకూడా ఎన్నికల కమీషన హెచ్చరికలను ఖాతరుచేయడంలేదు.

ప్రజాస్వామ్యవ్యవస్థకు ప్రాణంవంటి పార్లమెంటరీ ఎన్నికలు రాజకీయవాదుల అరాచకాలతో అపహాస్యం పాలుకావడం క్షమార్హంకాని నేరం. ఇటువంటి నాయకులను చట్టాలేమీచేయలేవు- ప్రజలే గుణపాఠం చెప్పాలి.

---

## జమీన్‌రైతు

9-5-1941

12 పేజీలు అణా

### పల్లెటూళ్ళ సమస్యలు

గూడూరు న్యూస్‌రీల్

అంగం వెంకటసుబ్బయ్యగారూ! పంచాయతీబోర్డు తీట నీకెందుకు తగులుకున్నదయ్యా?

* * *

పోలపాళెపురెడ్డు చేపల గతసంవత్సరం రు 220లకు వేలంపాడితే ఈసంవత్సరం తగ్గి రు 8 లకే సిటీకరణం బ్రాహ్మడు పాడాడట! ఎందువల్లనో?

సన్నజనం పెరక్కతినే ఈ నీరు కంపుమీదకూడా సనాతన బ్రాహ్మణులకి అధిపత్యం కావాలె కాబోలు! ఉస్సే!!

సైదాపురం పోలేరమ్మ యుద్ధ దిక్కుల్ల హడావిడినుండి విన్న నేను బ్రిటిషర్ల జయానికి పోలేరమ్మ జాతర చందాలో కలి కుతికకు తగులుకున్నవి. —సిద్ధారెడ్డి.

హిట్లరు రాక్షసుడి జాతరతో వేగే యీ దినాల్లో పోలేరమ్మ జాతర మానుకుంటే ఏం? బాంబు గుండ్లు, టాంకులులేవే ఆ ముంతదగ్గర భయపెట్టడానికి?

ఓ చదువుకున్న క్రైస్తవులుగారూ! ఈ పిచ్చి జాతర్లతో యింత శ్రద్ధ

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

వుద్యుక్తులారా స్వాతంత్ర్య కృషికు లకు దోహదమివ్వ.

వాసిరి వార్షికోత్సవము

బోర్డుపాఠశాలవార్షికోత్సవం శ్రీకిడ ఉమామహేశ్వరరావుఅధ్యక్షతన జయప్రదముగా జరిగినది. వెంకట్రమణయ్యగారు స్కూళ్ళ శిక్షా క్రమమున మిళితముకాని ఇతర విషయములను గూర్చి ఉపన్యసించిరి. విద్యార్థులచే రెసిటేషన్, కపటవేష ప్రదర్శనము, గయాపాఖ్యానము ప్రకాశలో కొంత పోర్షన్ ప్రదర్శించబడెను. విద్యార్థులకు బహుమతులొసంగబడెను

### నెల్లూరు ముచ్చట్లు

శానిటరీ ఇన్స్పెక్టర్ల మార్పు

భాశేశ్వరరావు, సాంబశివరావు గార్లను మరో జిల్లాకు మార్చారు.

ఈ పద్ధతి చాలామంచిది ఎక్కడివారక్కడే వుండడంవల్ల శానిటేషన్ నాశనం కొరుకు. హోటళ్ళవల్లనే సాంక్రామిక వ్యాధులు వ్యాపిస్తున్నవి. హోటళ్ళలోపిడు నియంత్రణ భార్యామణులమాదిరి ఉచితంగా మెక్కేవన్నీ అవి ఎంత భయంకరంగావున్నా బాడీపోలికిపోరు కొత్తవారు ఈ వుచితవ్యాధికి పాల్పడకుండుడగాక! ఎక్కువ కంప్లెయింట్సువుంటే కృష్ణరావుగారి ఆశ ఇంకా ఆడుగంటలేదేమి?

సోడా

రాతోయిగ ధరేని నూనె దేశా చం శెట్టి యిల్లు "ప్లవ యుగం" కోస గత 20 తేది వెళ్ళేశాంట. ఏమీ దొరకలేదు.

---

# కమ్యూనిస్టులు ఆలోచించాలి!

ఈ నెల మూడవతేదీ "ఆంధ్ర"లో బి. జె. పి. మతతత్వాన్ని ఎండగడుతూ ఆ పార్టీని దేశశత్రువుగా అభివర్ణిస్తూ సంపాదకీయం వెలువడింది గత 44 సంవత్సరాల ప్రధానాశక్తిగా ప్రగతిని దేశాంగ విధానాన్ని ఆ పత్రిక సమర్థించింది మరి ఈ క్లిష్టసమయంలో బిజెపికి లాభించగల కాంగ్రెసు వ్యతిరేకతా ధోరణిని అనుసరిస్తూవుంది. ఓట్లనుచీల్చి బిజెపికి బలాన్ని సమకూర్చడంకంటే, బిజెపి కన్నా తక్కువ శత్రువైన కాంగ్రెసును సమర్థించవచ్చుగదా! సామ్రాజ్యవాదంకన్నా ప్రమాదకరమని అనాడు ఫాసిజాన్ని వ్యతిరేకించి బ్రిటిష్‌తో యుద్ధంచేసిన రెనిజాను కమ్యూనిస్టులు ఆదర్శంగా స్వీకరించాలి. ప్రధాన శత్రువైన బిజెపిని ఎదిరించేశక్తి ఈనాడు ముక్కచెక్కలైన కమ్యూనిస్టుపార్టీకి లేదు. జనతాదళ్ పరిస్థితి దీనికి భిన్నంగా ఏమీలేదు. అయినా నేటికీ కమ్యూనిస్టుపార్టీలు కాంగ్రెసుమీద గుడ్డిగా వ్యతిరేకతను ప్రదర్శిస్తున్నాయి. దేశ క్లిష్ట స్థితిని అవగాహన చేసికొని, కమ్యూనిస్టులు పునరాలోచించాలని నా మనవి.

కావలి — వి. వి. నరసింహాచార్యులు అడ్వకేటు.

### బాలాజీనగర్‌లో కుక్కల బెడద

బాలాజీనగర్‌లోని స్టీల్ ఫ్యాక్టరీ దగ్గర లక్ష్మీనగర్ శివార్లలో రాత్రిపూట నడవటానికి కష్టమైపోతున్నది. కుక్కల బెడద ఎక్కువైపోయింది కుక్కల కాటు విషపూరితమూ, ప్రమాదకరమూ కనుక మున్సిపల్ అధికారులు తక్షణచర్యలుచేపట్టాలని మనవి.

బాలాజీనగర్ —శాంతిప్రియ

### సాయిమందిరంలో విభూతి అమ్మకం

నెల్లూరు సాయిబాబా మందిరంలో విభూతిని ప్యాకెట్లలో పెట్టి అమ్ముతున్నారు. భక్తులకు బాధకల్గించే విషయమిది. మందిరం విభూతినిసైతం ఉచితంగా పంచిపెట్టలేని పేదస్థితిలోవుందా? అదాయం రావడంలేదా? కమిటీ పెద్దలు తమతప్పును సవరించుకొని పాతపద్ధతిలో స్వామివారి విభూతిని భక్తులకు అందివ్వాలని మనవి.

భక్తి పెరిగినప్పుడు కూడా కంట్రోలు




చేయడంకోసం ఎవరికి వారు పెత్తనం తీసుకోకుండా కమిటీ బాధ్యతలు కల్గిన వాలంటీర్లను నియమిస్తే బాగుంటుంది.

—ఒక భక్తుడు.

### స్థానిక నాయకుల విగ్రహాలూ పెట్టండి

స్వాతంత్ర్య సమరంలో తమ జీవితాలను పణంగాపెట్టి పోరాటం సల్పిన ఎందరో స్థానిక నాయకులను ఈ తరం ప్రజలు మర్చిపోతున్నారు. దేశ స్వాతంత్ర్య సౌధానికి రాళ్ళెత్తిన కూలీలు వాడవాడ స్థానిక నాయకులు. జిల్లాస్థాయి పిపుల పోరాటంవల్లనే దేశస్థాయి ఉద్యమం రూపుదిద్దుకున్నది వీరవేవాడు రేస్తుంది

—కొరవ 7 పేజీలో


GLISH SCHOOL

APOLLO ENGLISH SCHOOL

అపోలో ఇంగ్లీషు స్కూల్

సావిత్రి నగర్-(నిప్పో ఎదురుగా)

వేదాయపాళెం, నెల్లూరు-4

మీ పిల్లలను 'అపోలో'లోనే ఎందుకు చేర్చాలి?

1) మేము మద్రాసు నుండి కేవలము స్కూల్ అభివృద్ధి చేయుటకుమాత్రమే వచ్చియున్నాము: 24 గంటలు మీ పిల్లల భవిష్యత్తు గురించి కృషి చేస్తాము.

2) తెలుగు మాతృభాష కాకుండ ఇంగ్లీషులో ప్రావీణ్యముగల మాంటిస్సోరి శిక్షణ పొందిన ఉపాధ్యాయులచేత శిక్షణ ఇవ్వబడును.

3) ఒక సంవత్సరము లోపు మీ పిల్లలు తప్పనిసరిగా ఇంగ్లీషులో మాట్లాడగలరు.

4) మా పాఠశాలకు అనుబంధముగా హాస్టల్ వసతి మరియు అన్ని ప్రాంతములకు వాహన సౌకర్యము కలదు.

5) మా పాఠశాల పునఃప్రారంభము 5-6-1991

అడ్మిషన్లు జరుగుచున్నవి

త్వరపడండి!

ఎన్.ఎ. రాజన్

కరస్పాండెంట్

O M ADs.

# చిరస్మరణీయం, ఆత్మానందకరం నెలరోజుల కైలాసయాత్ర!

[ఆడిటర్ దశరథరామిరెడ్డిగా పరిచితులైన శ్రీ అడుసుమల్లి దశరథరామిరెడ్డి జీవితంలో ఒక మలుపు వచ్చింది. కేవలం అర్థిక వ్యవహారాలకే పరిమితమై వుండిన శ్రీ దశరథరామిరెడ్డి ఆధ్యాత్మిక పారమార్థిక రంగాలకేసి కూడా మరలారు. హిమాలయాలలోని ప్రసిద్ధ ప్రదేశాలను, ఆశ్రమాలను సందర్శించడం, సాధువులతో సాంగత్యం ఏర్పరచుకోవడం జరుగుతున్నది. ధర్మచింతన, దాన

## హిమాలయాల్లో సాహసయాత్ర (1)

ఆడిటర్ దశరథరామిరెడ్డి

శీలత ఆయనలో ఎంతగానో చోటు చేసుకున్నాయి. ప్రతి సంవత్సరం ఆయన హిమాలయసానువుల్లో సంచరించి పునీతులవుతున్నారు. శ్రీ కైలాస పర్వతం, మానస సరోవరం వంటి కష్టసాధ్యమైన ప్రదేశాలను కూడా సందర్శించి జీవితాన్ని సార్థకం చేసుకున్నారు శ్రీ దశరథరామిరెడ్డి. తన హిమాలయపర్యటనానుభవాలనుగూర్చి



చలి మంచులను తట్టుకునే బందోబస్తు దుస్తులలో శ్రీ దశరథరామిరెడ్డి

శ్రీ దశరథరామిరెడ్డి వ్రాసినవ్యాసాలను ఈ వారం నుండి 'జమీన్‌రైతు' పాఠకులు ప్రతి వారం చదువగలరు. సం]

న్యూఢిల్లీ జనపథ్‌లోనున్న ఉత్తర ప్రదేశ్ టూరిజం ఆఫీసునుంచి మొదలైన మా శ్రీకైలాస్, మానస సరోవరయాత్ర ముప్పయి రెండురోజులకు పూర్తి అయింది. మొత్తం 800 కిలోమీటర్ల ప్రయాణం 28 రోజులు కాలినడకన. గుర్రాలమీదా, కంచరగాడిదలమీదా, యాక్‌లమీదా కొన సాగింది నాలుగురోజులు బస్‌ప్రయాణం. ఈ యాత్ర ప్రయాసతోనూ సాహస సహనాలతోనూ కూడుకున్నది. కానీ చిరస్మరణీయమైనది ఆత్మానంద ప్రదాయకమైనది.

ఆరోగ్యవంతులైనవారికే అనుమతి లభించే ఈ యాత్రకు ఎంతో సిద్ధపాటూ, ముందు ఏర్పాట్లు అవసరం. క్రమశిక్షణాయుతంగా సాగవలసిన ఈ యాత్రలో ఉత్తరప్రదేశ్ టూరిజం శాఖ యాత్రికుల వెంట ఒక గైడ్‌నూ, ఒక డాక్టరు, ఇద్దరు వంటవాళ్లనూ, వలుగురు సాయుధ పోలీసులను ఏర్పాటు చేస్తుంది. ఇంతేకాక బృందంతోపాటు అత్యవసర పరిస్థితుల నెదుర్కొనేందుకు ఒక వైర్‌లెస్ పరికరాన్ని, దానిని నిర్వహించేందుకు ఇద్దరు అధికారులనూ పంపుతారు. భారత - చైనా సరిహద్దుకు పదిహేను కిలోమీటర్ల దూరం నుండి ప్రతి ఇద్దరు యాత్రికులకూ ఒక సాయుధ ఇండో టిబెటియన్ సరిహద్దు పోలీసును నియమిస్తారు.

పురాణ ప్రశస్తి గాంచిన గాంచిన శ్రీ కైలాస పర్వతమూ, మానస సరోవరమూ ప్రస్తుతం చైనా వారి అధీనములోవుండే

—కొరవ 11వ పేజీలో

## సణుగుడు

* రమేష్‌రెడ్డికి భస్మాసుర వరం.

మునిసిపల్ ఛైర్మన్ శ్రీ వి రమేష్‌రెడ్డినియాసే నాశెందుకో భస్మాసురుడు జ్ఞాపకం వస్తుంటాడు. రాజకీయాలలో తన గొయ్యి తానే త్రవ్వుకోగల సమర్థుడు, తను వెత్తిన తానే పడ్డగల్లోగల విజ్ఞుల సరసన రమేష్‌రెడ్డికి తొలిసీట వేయవచ్చు.

అన్నగారి పిల్ల ఒలిమానం అనే ఒకే ఒక అర్హతతో రాజకీయ అరంగేట్రం చేసినవాడు రమేష్‌రెడ్డి. అదే అతన్ని, మూడు లక్షల మంది నెల్లూరీయులను పథమ పౌరుడిగా పరిపాలించే దశకు పెంచింది. కాలాంతరంలో క్రిందుల తపస్సు చినా ఎంతోమంది అందుకోలేని అందలం అది. రాజకీయానుభవం వుండి వుంటే ఈ నిచ్చెనతో పైమెట్లు కీ వుండేవాడు రమేష్‌రెడ్డికూడా; అది లోపించడం వల్ల ఎన్టీ ఆర్ దగ్గర తనకున్న చొరవను భస్మాసురవరంగా తీర్చిదిద్దుకుంటున్నాడు.

నోరు పె ట్టుకోకుండే రాజకీయవాదులు రాణింపుకు రాలేనిమాట నిజమేకాని, నోరు పారేసుకుండే అదే రాజకీయవాది పతనానికి నాంది అవుతుంది. ఈ రెండింటిమధ్య వుండేది సూక్ష్మమైన తేడా; అది గుర్తించగల్గడంలోనే రాజకీయవాది చతురత వ్యక్తమౌతుంది.

అది అమాయకత్వమనాల్నో, అజ్ఞానమనాల్నో, అహంకారమనాల్నో - రమేష్‌రెడ్డి ఈ మధ్య నోరుపారేసుకోవడంతో అందరినీ మించిపోతున్నాడు. మొన్న 4 తేది తెలుగుదేశం కార్యకర్తల సభ పేరిట జరిగిన సమావేశంలో రమేష్‌రెడ్డి వాడిన పదజాలం విన్న వారు ఆయన కేమైందా అని ఆశ్చర్యపోయారు. కౌన్సిలర్లను, వ్యతిరేకవాళ్ళను, తోటి దేశం నాయకులను తనమనలేదా లేకుండా తల్లుల శీలాన్ని శంకిస్తూ అరడు విరుచుకుపడుతుంటే, రాష్ట్ర పరిశీలకుడుగా వచ్చిన మాధవరెడ్డి సైతం మౌనప్రేక్షకుడుగా వుండిపోవలసివచ్చిందట. అరటి వాక్స్‌వానికి అర్థంపోతే, ఒనరల్లికి చెడ్డపేరు వసు నేమోనని భయపడినట్లున్నారాయన.

### డోలేంద్ర

కౌన్సిలర్లను ఆయన లోపర్లు అని సంబోధించారట. అదే సమావేశంలో వున్న కొందరు కౌన్సిలర్లు తిరగబడి, చేయెత్తే పరిస్థితి దాకా వచ్చిందట వ్యవహారం. రామనారాయణరెడ్డికి కూడేదికున్నంత సహనం వుండి జాబట్టి సరిపోయింది కాని, లేకుంటే ఆసమావేశంలో రుధిరధారలు కారివుండేవని చెపుతున్నారు చూసినవారు.

వృద్ధిలోకిరావలసిన ఒక యువరాజకీయవాది ఎందుకిట్లా ప్రవర్తించవలసివస్తున్నది? ఛేర్మన్ అయిన తొలిదినాలలో రమేష్‌రెడ్డికి మునిసిపాలిటీ లో ఎదురులేదు. పార్టీ రహితంగా, కాంగ్రెస్ కౌన్సిలర్లతో సహా ఆయన కుండేవారికి నిలుపులేదాలు కాలి

—కొరవ 11వ పేజీలో


## భవనము లీజుకు కావలయును

ఒక వ్యాపారం, బ్యాంకింగు సంస్థవారికి కోవూరులో లీజుకై భవనము కావలయును స్వంత భవనము లేక స్థలము కలిగి బ్యాంకువారి యొక్క ప్లాను ప్రకారము భవన నిర్మాణమునకు ఆసక్తి కలిగియున్న వ్యక్తులనుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. మీ దరఖాస్తులో మీ భవనము/స్థలము యొక్క వివరములు, ప్లాను కొలతలు మరియు ఆశించు బాడుగ లీజు వివరములతో మీ దరఖాస్తులను 28.5.91 తేది లోగా ఈ క్రింది చిరునామాకు పంపవలయును పై స్థలములో ఖాతాదారులు సైకిళ్ళు, బ్యాంకు సిబ్బంది స్కూటర్లు, మరియు ఇతర వాహనములు ఉంచుటకై తగినంత ఖాళీస్థలముకూడా కలిగివుండవలెను కావలసి: భవనము యొక్క కొలతలు షుమారుగా 6500 చ॥అ॥

దరఖాస్తు చేయవలసిన చిరునామా

Advt. బాక్స్ నం. 11

C/o. జమీన్‌రైతు - నెల్లూరు.



## జమీన్‌రైతు

### ప్రకటన రేటు పెంపకం

పత్రిక వుత్పత్తి, నిర్వహణ భారంమోయలేనిదై పోయింది. నష్టంతో నెట్టుకరావడం దుస్తరమై పోతున్నది. అందువల్ల 3.5.91 సంచికనుండి ప్రకటన చార్జి కాలం సెంటీమీటరు పదికూపాయలు పెంచుతున్నాము. ప్రస్తుతానికి పత్రిక చందా మాత్రం పెంచడంలేదు. ప్రకటనదార్లు సానుభూతితో యథా ప్రకారం సహకరించగలరని ఆశిస్తాము.

.మేనేజరు.


# సకలరోగాల వ్యాప్తికీ సహకార మందజేస్తున్న సైడుకాలువలు!

### సింహపురి

నెల్లూరు వహబ్‌పేటకాపురస్తుడు శ్రీ వి. మదనమోహన్ మునిసిపల్ హెల్త్ ఆఫీసర్‌కు ఒక లేఖ వ్రాశాడు. ప్రజలం ఆరోగ్య పరిరక్షణను పణంగాపెట్టి అధికారులు అర్థనలోపడిపోయారని నిందిస్తూ, మరీ నిర్మొగమోటంగా వ్రాశాడాయన. హెల్త్ ఆఫీసరుగారు దాన్ని చదవకుండానే చెత్తబుట్టలో విసిరిపారేసివుంటే ఆశ్చర్యపడాల్సిందేమీలేదు. అయితే, ఆ జాబులో ఆ పౌరుడు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలు ఆలోచించవలసినవిగా కన్పడుతున్నాయి. వాటిలో ప్రథమమైనది- సైడుకాలువల్లోకి ఇళ్ళలోని లెట్రిన్లనుంచి మలమూత్రాలను వదలడంవల్లనే టౌన్‌లో రోమలబాధ పెరిగిపోతున్నదన్నది అతడి ఆరోపణ

అది నిజంకూడా! పాత టౌన్‌లోని పందలాది ఇళ్ళకు సెప్టిక్ లెట్రిన్లు వున్నాయికాని, ట్యాంకులులేవు; డ్రైనేజి పైపులకు కనెక్షన్లు తీసుకోలేదు. లెట్రిన్ నుంచి ఒక గొట్టం నడిపి, సైడుకాలువల్లోకి వదిలేస్తున్నారు. ఇదివరకటిలాగ ఈ కాలువను శుభ్రం చేయకపోవడంతో, మలమూత్రాలు ఎక్కడికక్కడ పేరుకొనిపోయి దుర్గంధం వెదజల్లుతున్నాయి దోమలకు సురక్షిత ప్రసూతికేంద్రాలుగా వుపయోగపడుతున్నాయి. పాత టౌన్‌లోని ఇల్లిల్లూతిరిగి, ఇట్లా అక్రమంగా సైడుకాలువకు లెట్రిన్‌పైపులు తగిలించినవారిని గుర్తించి, వారు దగ్గరనీ డ్రైనేజి కనెక్షన్లు తీసుకునేటట్లు ఒత్తిడిచేస్తే దోమలబాధ, దుర్వాసనలతోత కొంత తగ్గుతుందనుకుంటాము.

సైడుకాలువల్లో చల్లవలసిన మందులు గిందులు ఏమైపోతున్నాయన్నది ఇంకొక ప్రశ్న. ఇదివరకటిరోజులలో ప్రతిదినం

—కొరవ 8వ పేజీలో


ఉత్తమ పోషణ ఉత్తమ రక్షణ ఉత్తమ శిక్షణ

## హాస్టల్ స్వాతి

మీ బిడ్డలను నెల్లూరులో చదివించదలచుకున్నారా! ఇదిగో చక్కని అవకాశము. మాచే నిర్వహింపబడు 'స్వాతి' వసతి గృహము నందు 1 నుండి 10వ తరగతి బాలబాలికలకు (ఏ కాన్వెంటులో చదువువారైనను) ఏ మీడియం వారైనను గృహవాతావరణంలో, చక్కని ఆదరణతో, ఉత్తమశిక్షణ ఇవ్వబడును.

పూర్తి వివరములకు మే 15 లోగా క్రిందిచిరునామాలో సంప్రదించండి

| | |
|---|---|
| హానరరి డైరెక్టర్ | కరెస్పాండెంట్ |
| E. RAMANA REDDY | K. SUNEETHA |
| M. A., B. Ed., | B.Sc., B. Ed., |

HOSTEL SWATHY

27/985, Chandramouli Nagar, Nellore-4

(Opp Vedayapalem Bus Stand)

Towards East

# నెల్లూరు పొలిటిక్స్

విశ్లేషకుడు

## ఎండ

ఈవారం పగటి గరిష్ట ఉష్ణోగ్రత వివరం—

| | |
|---|---|
| 4 తేది | 104.9 ఫా. హీ. |
| 5 ,, | 106.9 ,, |
| 6 ,, | 106.8 ,, |
| 7 ,, | 109.8 ,, |
| 8 ,, | 107.6 ,, |
| 9 ,, | 107.6 ,, |
| 10 ,, | 102.8 ,, |

## జనార్దనరెడ్డి

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి 16 తేది సాయంత్రం నెల్లూరు జిల్లాలో ఎన్నికల పర్యటనకు వస్తున్నారు. సాయంత్రం 4 గంటలకు కావలిలో సభ; రాత్రి 7 గంటలకు వి ఆర్ హైస్కూలు గ్రౌండ్స్‌లో బహిరంగ సభ. రాత్రికి ఇక్కడే మకాం. 17 తేది ఉదయం 9 గంటలకు గూడూరు. 10 గంటలకు నాయుడుపేటలో బహిరంగ సభలనుద్దేశించి ప్రసంగించి, చిత్తూరుజిల్లా వెళ్తారు.

ఈచిన్న సభలలో మట్లాడిపోవడం కాకుండా-అక్షవ్యస్తంగా, అయోమయంగా వున్న నెల్లూరు స్థానం ప్రచార వ్యవహారాలను చక్కదిద్ది, ఎమ్మెల్యేలకు సరైన పనులు సమకూర్చి, అందరిమధ్య సమన్వయం సాధించి వెళ్తేనే ముఖ్యమంత్రి పర్యటనసఫలమౌతుంది ఈ బాధ్యత ఇంకొకరికి అప్పజెప్పడంకాకుండా; ఎమ్మెల్యేలతో ఆయన నేరుగా సంభాషించి, పనులూ స్వయంగా అందిస్తేనే ఫలితం వుంటుంది.

## హనుమంతరావు

పి సి సి అధ్యక్షుడు శ్రీ వి. హనుమంతరావు 16 తేది విజయవాడనుంచి నెల్లూరుజిల్లాకువస్తున్నారు. ఆ సాయంత్రం 5 గంటలకు కావలిలో సభ; రాత్రికి నెల్లూరులో బహిరంగ సభ. 18 తేది ఉదయం గూడూరు, నాయుడుపేట చూచుకొని చిత్తూరుజిల్లా వెళ్తారు.

## ఎన్టీఆర్ పర్యటన తుస్సుమన్నదీ!

నెల్లూరు టౌన్‌లో 9 తేది మిట్ట మధ్యాహ్నం జరిగిన తెలుగుదేశం అధినేత శ్రీ ఎన్ టి రామారావు ఎన్నికల ప్రచార సభ చాలా పేలవంగా జరిగింది. గాంధీబొమ్మ ఎదురుగా చైతన్యరథంనిల్పి అరగంటకు పైగా కాంగ్రెస్‌ను తిట్టివెళ్ళాడాయన. మొదట కోఆపరేటివ్ బ్యాంకు ఆవరణలో సభ అని ప్రకటించారు. జనం రాకపోయేసరికి రోడ్డుసే బండి నిలిపి మాట్లాడేశాడు. అటు ఇటు నూరు గజాలకు మించి జనం చేరలేదు. రెండు నెలల క్రితం జరిగిన గాంధీ విగ్రహావిష్కరణ సభతో పోల్చినా ఈ సభ జనరాహిత్యంగా జరిగినట్లేలెక్క. దినపత్రికలు మాత్రం 'గ్రాండ్ సక్సెస్' అని, 1982 నాటి ప్రతిస్పందన వ్రాశాయి. వెంకటాచలంలో చైతన్యరథంనిల్పి, జనం లేనందుకు పోయేవారికి మాట్లాడకుండానే వెళ్ళిపోయాడు ఎన్ టి ఆర్. కోవూరు, అల్లూరులలో మాత్రం సభలు బాగాజరిగాయి.

## తెలుగుదేశంలో శీనయ్య కుమారుడు?

శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కుమారుడు ప్రసన్నకుమారరెడ్డి, మేనల్లుడు శ్రీ సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి ఇద్దరూ త్వరలో తెలుగుదేశం స్వీకరించనున్నారని వినికిడి. ఈ ప్రచార వేదికపై శ్రీ బేగా నారసింహారెడ్డి సిద్ధరి విన్నపాన్ని ఎన్ టి ఆర్ చెవినవేశాని, ఆయన అందుకు గ్రీన్‌సిగ్నల్ మంజూరుచేశాడని రామమూర్తినగర్ గూఢచారి వర్గాల రహస్య వర్తమానం. దీన్ని దృష్టిలో పెట్టుకొనే ఎన్టీఆర్, నెల్లూరు విలేఖరులతో నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి పునరాగమనం అభ్యంతరకరంకాదని ప్రకటించాడు.

అయితే శ్రీనివాసులురెడ్డిమాత్రంపార్టీ మార్పే ఆలోచనవున్నట్లులేదు. పార్టీమారితే ఎమ్మెల్యే పదవి ఊడిపోతుంది కాబట్టి, కాంగ్రెస్ చేత బహిష్కరింపజేసుకొని లోపాయకారిగా తెలుగుదేశంతో స్నేహితం నెరపాలని ఆయన తలపెడుతున్నాడట.

## దండకాల పదంతులు

కాంగ్రెస్‌పార్టీ ఎన్నికలనిధి సాకుతో బస్ ఆపరేటర్లు, సారాయి కాంట్రాక్టర్ల దగ్గర పెద్దమొత్తాంలో అధికారులే నిధులు దండుతున్నట్లు పదంతిగావుంది. జిల్లా కాంగ్రెస్ పెద్దల పేరుచెప్పి మరీ వసూళ్ళు చేస్తున్నారట.

దండేది అధికారులైనా, అవి చరేది కాంగ్రెస్ పెద్దలకే ఈ సిగ్గుమాలిన పనికి పాల్పడుతున్నవారు తమవల్ల పార్టీపరువు పోతుందనేమాట విస్మరిస్తున్నట్లున్నారు.

## ఇప్పుడా గ్రూపు మీటింగు?

పార్లమెంటు కాంగ్రెస్ అభ్యర్థిని కుమారి పద్మశ్రీ విజయానికి కృషిచేసే విషయం చర్చించుటకు జి. కాం. మాజీ అధ్యక్షుడు, మాజీ శాసనసభ్యుడు శ్రీ కె. వి. సుబ్బారెడ్డి 12 తేది ఉదయం 9 గంటలకు ఇ దిరాభవనాలో కాంగ్రెస్ వర్కర్ల సమావేశం అంటూ ఒకటి ఏర్పాటుచేశారు.

ఇది సుబ్బారెడ్డి వర్గం సమావేశం ప్రత్యేకంగా సమావేశం ఎందుకని ప్రశ్నిస్తే, తాము కాంగ్రెస్‌కతప్ప మరొకరికి పనిచేసే ప్రశ్నేలేదని, టవున్‌లో తాను పరిగణింపదగిన ఒక కాంగ్రెస్‌వాదినని, కాని ఎన్నికలలో తన సేవలను వినియోగించుకునే వుద్దేశ్యం జి. కాం. నాయకులకు వున్నట్లులేదని, కాంగ్రెస్ వాదులైన తమను విస్మరించి, కొత్తగా తెలుగుదేశంనుండి వచ్చినవారికి ప్రాధాన్యత ఇవ్వబడుతున్నదని. ఈ అసంతృప్తి తన అనుయాయుల్లో తీవ్రంగా వుందని, అందువల్లే కలిసి మాట్లాడుకొని కాంగ్రెస్ అభ్యర్థికి పనిచేసే కార్యక్రమాన్ని రూపొందించదలచుకున్నామని శ్రీ సుబ్బారెడ్డి చెప్పారు. తె. దే. కౌన్సిలర్ల సమావేశంలో తనను అవమానపరిచారనే వుద్దేశ్యం కూడా సుబ్బారెడ్డి గారిలో వుంది.

ఏమైనా సుబ్బారెడ్డిగారు గ్రూపు మీటింగు ఏర్పాటుచేయడానికి ఇది సమయం కాదు.

జి కాం అధ్యక్షుడు శ్రీ సంజీవరెడ్డి కాంగ్రెస్‌లోని వివిధవర్గాల వారిని సమన్వయపరచి, ఒకరికొకరికి పొర్పొచ్చాలు లేకుండా బాధ్యతలు నప్పగించి కాంగ్రెస్ విజయానికి అన్ని శక్తులనూ పూర్తిగా ఉపయోగించుకోవడం అవసరం.

## శ్రీనివాసులు రెడ్డి డ్రామా

కోవూరులో ప్రచారం ప్రారంభానికి నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారు పెద్ద డ్రామా ఆడారు. 8 తేది ఉదయం ఆయన ఇంటిముందు కోటమండి బయలుదేరుతుంటే జనం చిగారు. 'మున్ముందు ప్రచారానికి పోవడానికిలేదు' అని కేకలు పెట్టడంతోపాటు, పోతే పెట్రోలుపోసుకొని తగులబెట్టుకుంటామని ఇద్దరు అనుచరులు బెదిరించడం - వారి ఆప్యాయతకు కరిగి నీరైన శీనయ్యగారు "మీ కోరిక మన్నిస్తున్నా"నని చెప్పి "రాజీవ్‌గాంధీ చెప్పినా నెల్లూరులో ఎన్నికలప్రచారం చేయనని" ప్రకటించి, కారులో ఉద్రేక పైచరాకారుక వెళ్ళడం...అంతా నాటకీయంగా జరిగిపోయింది ప్రచారం చేయనని ఒక్క మాటచెపితే సరిపోయేదానికి ఇంత డ్రామా ఎందుకో ఆయనకే తెలియాలి!

## హత్యా నేరాలు—శిక్షల వడ్డింపులు

నెల్లూరు వేదాయపాళెం ఆర్. టి. ఓ ఆఫీసు సమీపంలో 21-6-88 తేది రాత్రి వి. ఆర్. కాలేజి డిగ్రీ విద్యార్థి బూదనం కృష్ణ (20) ను హత్యచేశారనే నేరాలో పఠాపీర వెంకటరెడ్డి కోటేశ్వరరావు, రాయపనేని రంగయ్య, మారంరెడ్డి వసుం

—తరువ 7 వ పేజీలో

## రాజీవ్ కే...

(మొదటిపేజీ తరువ)

తున్నారు. రోజులు గడిచేకొద్దీ కాంగ్రెసు శిబిరంలో ఉత్సాహం పెరుగుతుంటే, తెలుగుదేశం వర్గాలు నీరసపడుతున్నాయి. సాక్షాత్తు రాజీవ్‌గాంధీయే అంధ్రప్రదేశ్‌లో ఈసారి సీట్లుతగ్గే అవకాశం వుందని పదేపదే ప్రకటన చేయడంతో మొదట కాంగ్రెస్ వాదులు భయపడ్డారు కాని ప్రచారం వేగ-పుంజుకొని, అభ్యర్థులకు ప్రజలనుంచి మంచి ప్రతిస్పందన లభిస్తుందనే వార్తలు వెలువడడంతో అందరిలోనూ ధైర్యం పెరిగింది. తెలంగాణాలో కాంగ్రెస్‌కు బలం ఏమాత్రం తగ్గలేదనేది బాగాస్పష్టంగాకన్పిస్తుంది. పలు నియోజక వర్గాంలో తెలుగుదేశం మూడవ స్థానానికి వెళ్ళిపోయే ప్రమాదముంది ఇక్కడి బిజెపి అభ్యర్థులు, అది కాంగ్రెస్ నట్లను తెలుగుదేశం నుంచి చీల్చుకొనే దోరణి వ్యక్తమౌతుండటమే దీనికి కారణం నక్సలైట్లు పనిగట్టుకొని రిగ్గింగ్‌కు పాల్పడితే తప్ప తెలంగాణాలో ఒక్కస్థానం కూడా కాంగ్రెస్ చేజారిపోదని పరిశీలకుల అభిప్రాయం.

ఉత్తరకోస్తాలో తెలుగుదేశం పుంజుకుంటున్నదన్న వార్తలు మొదట మొదట విన్పించాయి. అయితే, గ్యారంటీ స్థానమను కున్న సర్వాపూర్ సైతం సందేహంలో పడడంతో దానిపైకూడా ఆశలు చర్చిపోయాయి. ఒక్క అమలాపుర మాత్రమే ఈనాడు కాంగ్రెసుకు అనుమానంగావున్న స్థానం మధ్యకోస్తాలో ఏలూరు కు కాంగ్రెసు నాయకులు నిశ్చింతచేశాడు. స్థానిక రాజకీయాల ప్రభావమది. రాజమండ్రి, కాకినాడలలో కాంగ్రెసు పరిస్థితి బాగా మెరుగైంది. కృష్ణా, గుంటూరులలో తమకు ఒక్క సీటుకూడా రాదని దేశం నాయకులే అంగీకరిస్తున్నారు. బాపట్లలో జాక్షక్ వెంకటేశ్వరరావు పరిస్థితికూడా అంతే! ఒంగోలు, నెల్లూరులలో కాంగ్రెసుకు ఎదురులేదన్నది వాస్తవం.

రాయలసీమలో కర్నూలు, హిందుపురం స్థానాలపై తెలుగుదేశానికి ఆశవుండింది. ఎమ్మెల్యే చెన్నారెడ్డి హత్య తర్వాత హిందూపురంలో కాంగ్రెస్‌గెలుపు ఖాయమంటున్నారు. కర్నూలులో విజయభాస్కరరెడ్డి అంత సులువుగా ఓటమిని అంగీకరించేవాడుకాదు. ముఖ్యమంత్రి శ్రద్ధతీసుకొని అసంతృప్తివాదులను అణచగలిగితే ఆఖరి నిముషంలోనైనా అక్కడ పరిస్థితి చేయిదాటకుండా కాపాడుకోవచ్చు.

కాంగ్రెస్‌పట్ల ప్రజలలో పెద్దగా అభిమానం తగ్గకపోవడం; బి జె. పి. అభ్యర్థులు ప్రతిపక్షం ఓట్లలో చీలిక తేనుండడంతో రాష్ట్రంలో ఈసారి రాజీవ్‌గాంధీ కూడా ఆశ్చర్యపడే గెలుపు కాంగ్రెస్‌కు సిద్ధిస్తుందని చెపుతున్నారు పై వారానికి మరింత స్పష్టంగా పరిస్థితి అర్థమౌతుంది. ★


**Load King** డీజల్ జనరేటర్స్

పెట్రోలు బంకులకు, రైసుమిల్లులకు బ్యాంకులకు, కూల్ డ్రింక్ షాపులకు, బార్‌లకు, నర్సింగ్ హోమ్‌లకు Load King Generators 3 KVA నుండి 25 KVA వరకు సింగిల్ ఫేస్ మరియు త్రీ ఫేస్‌లలో లభించును. 1 సంవత్సరం గ్యారంటీ కిర్లోస్కర్ ప్రవచిత డీజల్ జనరేటర్స్ 40 KVA నుండి 1000 KVA వరకు లభించును.

డిస్ట్రిబ్యూటర్స్ : ఆంధ్ర మరియు రాయలసీమ ఫోన్ : 28501

MARUTI

మారుతీ ఏజెన్సీస్ & సర్వీసెస్

16/796ఎ. శంకర అగ్రహారం-నెల్లూరు

అల్విన్ కంపెని షోరూమ్

"మా ఆల్విన్ నాకు కావలసినవన్నీ ఇందులోనే ఉన్నాయి"

ఫుల్ బటన్ డిఫ్రాస్ట్‌తో పటిష్ఠమైన సెల్ఫ్ క్లియనింగ్ సిస్టమ్ ఆటోమేటిక్ డిఫ్రాస్ట్.

హిటాచి సాంకేతిక పరిజ్ఞానంతో కంప్రెసర్

రోలింగ్ బాటిల్ రేక్స్

ఏడు సంవత్సరాల వారంటీ

ALLWYN REFRIGERATORS QUIET STURDY FAITHFUL

పద్మావతి ఎంటర్‌ప్రైజెస్

ఆర్ టి.సి.బస్‌స్టాండ్ దగ్గర - నెల్లూరు

సులభవాయిదాల సౌకర్యము కలదు.

ONIDA/BUSH

TV/VCR

PHILCO Refrizerators

Maharaja Wash Aid

&

House hold Furnitures

Phone : 24024

ONIDA 21

Neighbour's envy Owner's pride

ఇన్నోవేషన్స్-నెల్లూరు

వినాయకహాలు ఎదురు లైనులో

ట్రంకురోడ్డు - నెల్లూరు

స్టాక్ రెడీగా వున్నది.

HURRY

కరంట్! కరంట్!! కరంట్!!!

SHRIRAM HONDA

The most reliable portable power

mass

మారుతి ఏజెన్సీస్ & సర్వీసెస్

16/796 A, శంకర అగ్రహారం, నెల్లూరు.

సబ్‌డీలర్స్ శ్రావణ్ ఆటోమొబైల్స్

శ్యామ్ & రామ్ ఎలక్ట్రికల్స్ PH: 457

ఫోన్: నెల్లూరు 28501. గూడూరు 306

# పార్టీ బలానికి మాగుంట వ్యక్తిగత బలం తోడవుతూంది!

ఢీకొనడం ఎవరి సాధ్యమూ కాదు.

పీటన్నిటివల్లా సుబ్బరామరెడ్డి అభ్యర్థిత్వం పట్ల నియోజకవర్గం మొత్తంలో ఒక విశిష్టమైన ఆసక్తి వ్యక్తమైంది. ఆయన్ను గెల్పించుకుంటే ఒంగోలులో పరిశ్రమలు స్థాపించి విస్తృతంగా ఉద్యోగాలిస్తారని, పెద్ద పెట్టున దానధర్మాలు చేస్తారనే అభిప్రాయం ప్రచారమౌతున్నది. ఈ ధోరణి ప్రభావం ప్రత్యక్షంగా కన్పిస్తుంటేది. ఒంగోలు టౌనులో! మామూలుగానే ఇది కాంగ్రెస్‌కు కంచుకోట. గత ఎన్నికల్లో రాజమోహనరెడ్డికి ఇక్కడ 28 వేల మెజారిటీ లభించింది. సుబ్బరామరెడ్డికొచ్చేసరికి అది కాస్తా 80 వేల దాకా ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. కావలి నియోజకవర్గంలోనూ పాతిక వేల మెజారిటీ వస్తుందని ఆశిస్తున్నారు. గత ఎన్నికలలో ఇక్కడి మెజారిటీ 11780. ఈసారి యానాదిరెడ్డితో, ఆవంవర్గంలోని తెలుగుదేశీయులందరూ కలిసి పనిచేయడంవల్ల దాదాగ్రామాలలో తెలుగుదేశానికి ఏజంటు లేని పరిస్థితి ఏర్పడివుంది. తెలుగుదేశానికి ఒక్క కొండపనాయుడు మాత్రమే మిగిలాడు.

కాంగ్రెసుకు మంచి లీడ్ తెచ్చే మరొక నియోజకవర్గం - కనిగిరి. గతంలోనే ఇక్కడ 25 వేల ఆధిక్యత లభించింది. ఎమ్మెల్యే తిరుపతినాయుడు మీద కొంత వ్యతిరేకత కన్పిస్తున్నప్పటికీ, కాంగ్రెసు ఓట్లు పుష్కలంగావున్న ప్రాంతం కావడంతో మార్పు వుంటుందనుకోలేము. సంతనూతలపాడులో సుబ్బరామరెడ్డికి కొంత తరుగుదల ఏర్పడవచ్చునని మొదట భయపడ్డారు. కాని, రాజమోహనరెడ్డి ఆజ్ఞను ధిక్కరించి, ఎమ్మెల్యే శ్రీ వై. వి. శేషు మనస్ఫూర్తిగా పనిచేయడంతో లోటు భయం తీరిపోయింది. కందుకూరులో మెజారిటీ చూపించడం ఎమ్మెల్యే శ్రీ మహీధరరెడ్డికి తప్పనిసరి. రాజమోహనరెడ్డిని మొదటగా ధిక్కరించినవారిలో ఆయన ఒకరు.

తెలుగుదేశం ఆశ అంతా కొండపిపైనే. ఎందువల్లనో ఈ ప్రాంతంలో కాంగ్రెసు చాలా వెనుకబడివుంది. గతంలోనూ అతి తక్కువ మెజారిటీ (7610) వచ్చిన నియోజకవర్గం ఇది.

ఉదయగిరి పరిస్థితి అయోమయం. మామూలుగానే ఇక్కడి ఓటర్ల మానసిక స్థితిని అంచనావేయడం సాధ్యంకాదు. ఆర్థికంగా ఎంత వెనుకబడిన ప్రాంతమో

(5 వ పేజీ కొరవ)

రాజకీయంగా అంత చైతన్యవంతమైనది. 89 ఎన్నికల్లో ఇక్కడ ఎమ్మెల్యే శ్రీ మాదాల జానకిరాంకు 3762 ఓట్లు మెజారిటీవస్తే, ఎంపీ శ్రీ రాజమోహనరెడ్డికి 8 వేలు ఆధిక్యత లభించింది. కులప్రాతిపదికన జరిగిన క్రాస్ ఓటింగు మహిమ అది. రిగ్గింగుకు అవకాశాలు ఎక్కువ. రాజమోహనరెడ్డి అనుచరులు పంతంపట్టి కాంగ్రెస్‌ను దెబ్బతీయదలిస్తే దుత్తలూరు, వరికుంటపాడు, మర్రిపాడు మండలాల్లో దేశం కత్తికి ఎదురుండదు. ఉదయగిరి మండలంలో మాత్రం జానకిరాం తన ప్రతాపం చూపగలడు. సీతారాంపురం, వింజమూరులలో చెరిసగమౌతుంది. స్థానిక రాజకీయాలు ప్రక్కనబెడితే ఈ ప్రాంతంలో కాంగ్రెస్‌పట్ల ప్రజలలో అభిమానం తరగలేదని చెపుతున్నారు. అదే నిజమైతే మొత్తం నియోజకవర్గంమీద కాంగ్రెస్ వెయ్యి, పదిహేనువేల లీడ్‌తో బయటపడాలి. కాని పాతనాయకత్వంలో రగులుతున్న ఆవేశం అంత తక్కువగా అంచనా వేయదగిందికాదు.

పార్టీ పలుకుబడి తప్ప, అభ్యర్థిగా స్వంత ఇమేజ్‌ను పెంచుకోలేకపోవడం దేగ ప్రచారంలో కొట్టొచ్చినట్లు కన్పించేలోపం. కాంగ్రెస్ అభ్యర్థితో పోటీపడి ప్రచారాన్ని నిర్వహించడం ఆయన తరం కావడంలేదు; తానంతటి శక్తిలేని వాడినని ఓటర్లకు నచ్చజెప్పడంలోనూ విఫలమౌతున్నారు. ఒంగోలు ప్రాంతంలో దేగ నారసింహారెడ్డికూడా లక్ష్మీపుత్రుడే నన్న అభిప్రాయం ప్రబలంగావుంది. అందువల్లే ఆయనకు సానుభూతి లభించడంలేదు.

రాజమోహనరెడ్డిని ఆయన అనుచరులను తమకనుకూలంగా త్రిప్పుకోవడంలో మాత్రం దేగ నారసింహారెడ్డి కృతకృత్యులైనారు. దీని ప్రభావం ఒక్క ఉదయగిరిలోనే కన్పిస్తున్నది. కావలిలో తెలుగుదేశం నాయకులందరూ కట్టకట్టుకొని కాంగ్రెస్‌కు వలసపోవడంతో దేగ పరిస్థితి ఇక్కడ బాగా దిగజారిపోయింది. ఒంగోలు జిల్లాలోని ప్రాంతాలలోమాత్రం తెలుగుదేశం నాయకులలో, కార్యకర్తలలో చెప్పుకోదగ్గ మార్పులు లేవు.

దేగ నారసింహారెడ్డి ఒంగోలు సీటుకు కావస్రయపడి పోటీకి దిగడం వెనుక ఏ అంచనాలు లెక్కపక్కలు వేశారో మనకు తెలియదుగాని, తెలుగుదేశానికేమంత క్షేమకరమైన స్థానంకాదు. గత ఎన్నికల్లో రాజమోహనరెడ్డి 97870 ఓట్ల మెజారిటీ సాధించిన స్థానమిది. ఈ ఒకటిన్నర సంవత్సరంలో కాంగ్రెస్ పట్ల వ్యతిరేకత ప్రబలే సంఘటనలేవీ తటస్థించలేదు. పైగా కాంగ్రెస్ అభ్యర్థి అత్యంత బలసంపన్నుడు; ధనబలం, జనబలం రెండూ ఎక్కువ. రాజమోహనరెడ్డి విద్రోహచర్యలు, ఎన్టీఆర్ పట్ల జనాకర్షణ వంటి అంశాలవల్ల తగ్గే కాంగ్రెస్ బలం, కొత్త అభ్యర్థి వ్యక్తిగత శ్రమ, ఇమేజ్, పత్రికాప్రచారాలవల్ల తిరిగి సమకూరే అవకాశంవుంది. ఒంగోలు టౌనులో ఎన్టీఆర్ సభ విఫలం కావడం ఇందుకొక నిదర్శనం. ఏ రూపంలో చూసినా, ఎన్నిలెక్కలు వేసినా ఒంగోలులో దేగ నారసింహారెడ్డి గెలుపుకు ఆస్కారం కన్పించడంలేదు.

• • •

బిజెపి అభ్యర్థి శ్రీ బతిన నరసింహారావు నామమాత్రం ప్రచారం నిర్వహిస్తున్నారు ఆయన ఉనికివల్ల తెలుగుదేశం ఓట్లుచీలి, కాంగ్రెస్‌కు మరింత మెజారిటీ పెరగడంతప్ప మరే ప్రయోజనమూ కన్పించడంలేదు ★

## జిల్లావార్తలు

(5 పేజీ కొరవ)

తీయ నాయకుడి దెబ్బతో మహిమో-ఆ కేసు మరుగునపడిపోయింది. చెప్పుకుంటే సిగ్గుపోతుందని దాచిపెట్టారు కాని, ఒక ఉన్నత పోలీసధికారిని నెల్లూరు కనక మహల్ సెంటర్‌లో ముగ్గురు ఆర్టీసి ఉద్యోగులు నడివీధిలో పట్టుకొని కొట్టారు. కాని సైకిళ్ళపై దౌర్జన్యంపేరుతో కేసు రిజిస్టరు చేసి చేతులు దులుపుకున్నారు.

పోలీసుల పరువు తుడిచివేసే సంఘటనలు వరుసపెట్టి ఇన్ని జరుగుతున్నా ఒక్క ఉన్నతాధికారికీ చీమకుట్టినట్లులేదు. తమశాఖలోని సబిన్స్పెక్టర్ ప్రాణానికి విలువ ఇవ్వని ఈ ప్రబుద్ధులు, ఇంక ప్రజల రక్షణకు ఏపాటి పనిచేస్తారు? ట్రాఫిక్‌కు అడ్డువచ్చే సైకిలిస్టునో, స్కూటరిస్టునో పట్టుకొని వేధించడానికి రోడ్డుపొడువునా కానిస్టేబుళ్ళను నిలబెట్టి ప్రవర్తిస్తున్నట్టు పోజులివ్వడం తప్ప- జిల్లాలో పోలీసు యంత్రాంగం ప్రజలకు ఏ రూపంగానైనా వుపయోగపడుతున్నదా? ఒక్క దొంగతనాన్ని నివారించడమో లేక కనిపెట్టి దోచినసొత్తును తిరిగి రాబట్టడమో చేయగల్గుతున్నదా?

ముఖ్యమంత్రిగారూ-మీ స్వంత జిల్లాలో పోలీసు యంత్రాంగం ఇంత చేతగానిదైపోయిన సంగతి మీ దాకా రాలేదా? మీ ప్రతిష్ఠ కాపాడుకోవడానికైనా అసమర్థులను, అవినీతిపరులను ఏరి పారేయండి! ★

### కలిచేడులో దొంగలభయం

ఇటీవలనే గూడూరు తాలూకా నుండి ఆత్మకూరు తాలూకాలోకి మారిన కలిచేడు ప్రాంతంలో దొంగతనాలు ఎక్కువైనాయి. ఏప్రిల్ నెలలోనే ఆ ప్రాంతంలో ఒక దొంగతనం, మరొక సందర్భంలో దొంగతనంతోపాటు హత్యకూడా జరిగింది. ఒకప్పుడు సైదాపురం నుండి ఇద్దరు పోలీసులు వచ్చి రాత్రివేళ పహరా చేసేవారు. ఇప్పుడది ఆగిపోయింది. ఎస్.పి. గారు ఈ విషయాన్ని గమనించి శ్రద్ధ వహించాలని ఆ ప్రాంత ప్రజలు కోరుతున్నారు.

### వ్యక్తిహత్య - లారీ దగ్ధం

గూడూరుపట్టణంలో ఎ.ఎస్. పెట్రోల్ బంకువద్ద ఈ నెల ఆరవతేదీ మధ్యాహ్నం షేక్ నాగూర్ (24) అనే లారీడ్రైవరును తి. శేఖర్ అనేవ్యక్తి కత్తితో పొడవగా హతుడు అక్కడికక్కడే మరణించాడు. ఈ సంఘటనతో పోగైన జనం ఆగ్రహంతో అక్కడే స్టాండులోవున్న ఒక లారీని తగలబెట్టారు. అడ్డం వెళ్ళిన లారీ క్లీనరును చితకబాదారు. హింసా దౌర్జన్యాలు నిత్యకృత్యాలై పోతున్నాయి. ఇంతకీ ఆ హత్యకు కారణం ఒక స్త్రీ విషయంలో తగాదా అట!

## జనవాణి

(8వ పేజీ కొరవ)

జాతీయనాయకులూలేరు.

నెల్లూరులో ఇటువంటి త్యాగధనులు ఎందరోవున్నారు. కాని వారిలో ఏ ఒక్కరి స్మృతి చిహ్నంగా టౌనులోగాని ఇతర ప్రదేశాలలోగాని విగ్రహాలు నెలకొల్పలేదు; స్మారకచిహ్నాలు ప్రతిష్ఠించలేదు. ఇప్పటికైనా మునిసిపల్ పెద్దలు, టౌనులోని ప్రముఖులు, వదాన్యులు జిల్లాకు సేవచేసిన పాత తరం నాయకుల విగ్రహాలను మంచి ప్రదేశాలు ఎంపికచేసి ప్రతిష్ఠించాలని మనవి.

నెల్లూరు —టి వి ఎం

(6 వ పేజీ కొరవ)

ధర రెడ్డి, ఈపూరు సురేష్‌బాబులకు జీవితఖైదు విధిస్తూ జిల్లా జడ్జి శ్రీ వి. వీరరాఘవన్ 4 వతేది తీర్పుచెప్పారు.

ప్రాసిక్యూషన్‌కు పి. పి శ్రీ కె. వి రమణయ్య, ముద్దాయిలపక్షంగా శ్రీ వి. అనంతరామయ్య వాదించారు.

• • •

వరుకూరు సెంటరులో రౌడీగా పేరు గాంచిన ఇల్లపు అనంత్‌ను 12-1-88 తేది మూకుమ్మడిగా హత్యచేశారని 28 మంది మీద మోపబడిన నేరాన్ని జిల్లా సెషన్సు జడ్జి శ్రీ వి. వీరరాఘవన్ విచారించి అందులో ఆకుల రమణయ్యకు ఐదు సంవత్సరాలు, అతనితండ్రి ఆకుల మస్తానయ్య, తాతా పెంచలయ్యలకు ఒక్కొక్క సంవత్సరం చొప్పున శిక్షలు విధిస్తూ 6 తేది తీర్పుచెప్పారు. నేరం రుజువుకాలేదని తక్కిన 25 మంది విడుదలచేశారు.

ఈ కేసులో ప్రాసిక్యూషన్‌కు పి. పి. శ్రీ కె. వి రమణయ్య, ముద్దాయిల పక్షంగా శ్రీ పి. విజయకుమార్ రెడ్డి వాదించారు.

### డి కె డబ్ల్యు కాలేజి సొసైటీ స్వాహా

ఇళ్ళస్థలాలకోసం డి కె డబ్ల్యు కాలేజి లెక్చరర్లు ఏర్పాటుచేసుకున్న సొసైటీలో పెద్ద గోల్మాల్ జరుగుతున్నాయని లెక్చరర్లు సొసైటీ కార్యదర్శి మొత్తం దిగమింగడానికి ప్రయత్నిస్తున్నారని ఆరోపణ వుంది విద్యావంతులైనవారూ ఇటువంటి అన్యాయపు పనులకు పాల్పడటం బాగాలేదు తప్పు సరిదిద్దుకుంటేసరి. లేకుంటే పరువు పోగొట్టుకుంటారు జాగ్రత్త!

### మరణాలు

వెంకటగిరి కాంగ్రెస్‌వాది శ్రీ పిల్లి పుల్లారెడ్డి తల్లి లక్ష్మమ్మ 30 తేది కాలధర్మం చెందింది.

• • •

రాజవోలుపాడు - శ్రీ పెనుబల్లి కృష్ణయ్య 27 తేది దివంగతులైనారు

పై రెండు కుటుంబాలకు మా సానుభూతి

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 19 5 అ. |
| సర్వేపల్లి ,, | 10 8 అ. |
| నెల్లూరు చెరువు | 18 7 అ. |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలకు 9872 (కొత్తవి) | 2000.00 |
| ,, 9674 క్రొత్తవి | 2200.00 |
| ఐ. ఆర్. 64 | 1850.00 |
| ,, 20 | 1775.00 |


SERVICE SERVICE

ఫోన్ : 28729

మీ టీవీ రిపేరా?

మీదేవూరైనా, ఏపేటైనా

మీ టీ.వీ. ని మీ ఇంటివద్దే

రిపేరు చేసిస్తాం!

పవన్ ఎలక్ట్రానిక్స్

టి. వి స్పేర్‌పార్ట్స్ అమ్మకపుదార్లు.

సర్వీస్ ఇంజనీర్లు.

నం. 2 DMR బిల్డింగ్స్

ఒకోలాల్డి ఎదురుగా

ట్రంకురోడ్. నెల్లూరు-1

SERVICE SERVICE

ఇల్లు అమ్మబడును

నెల్లూరు టవున్. ఉస్మాన్‌సాహెబు పేటలో 4వ వార్డులోని నం 4/524.1 ఇల్లు అమ్మబడును, మొత్తము విస్తీర్ణము 38 అంకణములు, 12 అంకణాలు కట్టుబడి గల మంగుళూరు పెంకుటిల్లు మున్సిపల్ కొళాయి, బావి, 2 సెప్టిక్‌ట్యాంకులు 2 బాత్‌రూములు కలవు. వివరములకు, వి. పుల్లయ్యగారిని పై ఇంటి అడ్రసులో సంప్రదించవచ్చును.

బాడుగకు ఇవ్వబడును

నెల్లూరు సుబేదారుపేటలోని రాధా కృష్ణా ఇంజనీరింగ్ కం మిద్దెపైన ఉమా ప్రింటర్సు ఎదురుగా 18 × 72 సైజు గల హాలు బాడుగకు ఇవ్వబడును. ప్రైవేటు ఇన్స్టిట్యూటులకు, కోచింగ్ సెంటర్లకు అనువైనది. వివరములకు;

ఎస్. పెంచలయ్య

అశోకా హోటల్

ఫోన్: 27102, 27108

ఎలక్షన్ మెటీరియల్స్

కాంగ్రెస్, బి జె పి, టి డి పి. బ్యానర్లు, జండాలు, బ్యాడ్జీలు. కటౌట్స్ వాల్‌స్టెన్సిల్స్: తోరణాలు, స్టిక్కర్లు తయారై వున్నవి. వెంటనే డెలివరి. సంప్రదించండి.

"ముని ఆర్ట్స్" Regd UNIT

సంతపేట, నెల్లూరు ఫోన్ 24592

BEST WISHES

ఒంగోలు పార్లమెంటు కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేయుచున్న, నా బాల్యమిత్రుడు, నా శ్రేయోభిలాషి బహుమంచివాడు

శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి

గారికి అత్యధిక మెజారిటీతో అఖండవిజయం చేకూర్చుమని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

నారు బాబూరావు

రాయాజీవీధి-నెల్లూరు

# మాగుంట గెలుపు-
# నియోజకవర్గ అభివృద్ధికి గొప్ప మలుపు!



మాకు అత్యంత ఆప్తుడు, పేదలపాలిటి పెన్నిధి,
నిరుద్యోగ సమస్యను పారద్రోలేందుకు ఎన్నో
పరిశ్రమలు స్థాపించి ఎందరికో జీవనోపాధి
కల్పించిన మంచి మనిషిగా అందరిచే ప్రశంసలు
పొందుతున్న అజాత శత్రువు,
ఒంగోలు నియోజకవర్గ కాంగ్రెస్ అభ్యర్థి

## శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి

గారిని

అత్యధిక మెజారిటీతో గెలిపించ ప్రార్థన

# I. R. K. Reddy and Sons

**H. P. C. Dealers**

**Brundavanam, NELLORE.**



కైలాస శిఖరం ముందు 'యాక్' మీద ఆసీనులైవున్న దశరథరామరెడ్డి

## కైలాసయాత్ర

(4వ పేజీ తరువాత)

టికెట్‌లో వున్నాయి. కనుక ఈ యాత్రకు పాస్‌పోర్ట్, చైనావీసా, చైనా ద్రవ్యము అవసరం.

ప్రతి ఏడాదీ మే నెలలో యీ యాత్రకొరకు పత్రికా ప్రకటనద్వారా దరఖాస్తులను కోరుతారు. యాత్రకు పోగోరేవారి దరఖాస్తుతోపాటు తాజాపాస్‌పోర్టు పంపవలసివుంటుంది. అతరువాత టూరిజం శాఖవారు యాత్రికులు ఎప్పుడు ఢిల్లీ రావలసిందీ, యాత్రి ప్రారంభపు తేదీ, యాత్రకు కావలసిన దుస్తులూ వగైరాలు తెలుపుతారు. అడ్వాన్సు చెల్లించాల్సి వుంటుంది. యాత్రి ప్రారంభానికి ఒక వారం ముందుగా ఢిల్లీకి పోవలసివుంటుంది.

ఢిల్లీలో యాత్రికులకు ఆరోగ్యపరీక్ష జరుగుతుంది. ముఖ్యంగా గుండే, ఊపిరితిత్తులు, రక్తపుపోటు పరీక్షచేసి యాత్రికుల అర్హతను నిర్ణయిస్తారు. ఆ తరువాత విదేశీ వ్యవహారాలశాఖ (చైనా విభాగము) వారు యాత్రికులకు యాత్రాసమయంలో ఎలా వ్యవహరించాల్సిందీ, ప్రయాణంలోని సమస్యలూ ఒకరోజల్లా వివరిస్తారు. అటుపైన యాత్రకు అవసరమైన విదేశీ ద్రవ్యము (500 అమెరికా డాలర్లు - షుమారు పదివేలం రూపాయలు) ఏర్పాటు చేస్తారు. ప్రతి యాత్రీకుడు 25 కిలోల బరువుపరకు వస్తువులు తీసికొనిపోవచ్చు. అంతకుమించితే ప్రతి కె. జి. కి కొంత ద్రవ్యము చెల్లించవలసి వుంటుంది.

యాత్రకుముందే అధికారులు యాత్రికులలో ఒకరిని బృందనాయకునిగా నియమించి, అతనికి అధికారపత్రం ఇస్తారు, యాత్రాసమయంలో ఎవరికైనా అనారోగ్యం సంభవిస్తే, వైద్యసౌకర్యం కోరే బాధ్యత ఆ నాయకునికి వుంటుంది.

28 రోజుల ప్రయాణంలో 5 రోజులు భారతదేశ భూభాగంలోనూ, 18 రోజులు చైనాలోనూ సాగుతుంది. లింపూ కనుమ వద్ద భారతయాత్ర నిర్వాహకులు యాత్రీకులను చైనా అధికారులకు అప్పగిస్తారు. వారు యాత్రీకులను తక్లకోట్ అనబడే టౌనుకు తీసికొనివెళ్ళి కస్టమ్స్ తనిఖీ చేస్తారు. మరునాడు విశ్రాంతి. ఆ సమయంలో చైనా యాత్రాపద్ధతిని వివరిస్తారు. మరుసటిరోజు యాత్రీకుల బృందంలో సగంమందిని మానస సరోవరం సందర్శనకు, మరోసగాన్ని శ్రీ కైలాస పర్వత సందర్శనకు బస్‌లో తీసికొనివెళ్ళి వదులారు. అక్కడనుంచి ఏ బృందానికా బృందం పర్యటనను కాలినడకతో మొదలిడుతారు.

శ్రీ కైలాస్ పర్యటన 52 కి. మీ పూర్తిచేసేందుకు 3 రోజులు పడతే మానస సరోవర పర్యటనకు 88 కి. మీ లు (80 కి మీ బస్సులో, మిగిలా 58 కి.మీ. దూరం కాలినడక) రెండురోజులు పడుతుంది. మూడవరోజు మానస సరోవరంలో పూజాదికాలు నిర్వహించబడుతాయి.

ఏడవరోజు మానస సరోవరం పర్యటనకు పూర్తిచేసిన బృందాన్ని శ్రీ కైలాస పర్వత సందర్శనకు, శ్రీ కైలాస్ పూర్తి చేసినవారిని మానస సరోవరానికి తీసుకపోతారు.

8, 9, 10 వ దినాలు సందర్శనలు పూర్తవుతాయి. పదకొండవరోజు అందరినీ బస్సులో తిరిగి తక్లకోట్ చేర్చుతారు. పన్నెండవరోజు అక్కడికి 20 కి మీ దూరంలో నున్న ఖేచర్‌నాథ్ దేవాలయ సందర్శనకు తీసుకొనివెళ్తారు. దాదాపు వెయ్యిసంవత్సరాల పురాతనమైన ఆ బౌద్ధ దేవాలయాన్ని సందర్శించి తిరిగి తక్లకోటకు చేరుస్తారు. పదమూడవరోజు విశ్రాంతి. తిరుగా కస్టమ్స్ చెక్ జరుపుతారు. పద్నాలుగవరోజు వేకువనే బయలుదేరి ఉదయం 8-30 కల్లా భారత సరిహద్దులలో వేచియున్న భారతీయ టూరిజం శాఖాధికారులకు అప్పగిస్తారు. ఇదీ స్థూలంగా శ్రీ కైలాస్ మానస సరోవర యాత్రాక్రమం—

వచ్చేవారంనుండి నా కైలాస, మానస సరోవర పర్యటన విశేషాలను వివరిస్తాను.

## రాముని పేరున?

సత్యవేటి

రాముని పేరన రాజ్యంగానికి
రక్తప్రవాహం రాస్తారా?
మతం పేరుతో మనిషి మనుగడకు
మరణ శాసనం వ్రాస్తారా?
కూడు పెట్టినా గుడిమా మతమూ
ఏనాడైనా చరిత్రలో?
మత మెరుగకనే లక్షల ఏళ్ళు
మనిషి బ్రతకలేదా?
కులంలేకనే శతాబ్దాలుగా
బ్రతుకు సాగలేదా?
మతయుద్ధాలకు కోట్ల జనగణం
ఆహుతి కాలేదా?
ద్వేషం రగిల్చి, దేశాన్ని చీల్చి
రాక్షస మంత్రం రామనామంస్తే
రాజకీయమునకిదే ధ్యేయమా?
రాజ్యాంగానికి రక్తప్రవాహం
రాముని పేరున రాస్తారా?

## సణుగుడు

(4 పేజీ తరువాత)

రాదు. ఈరోజు తెలుగుదేశం కౌన్సిలర్లు సైతం ముప్పాతికమంది ముఖం తప్పించేస్తున్నారు. ప్రక్కన నిలబడేవారు లేరు. అవినీతిరహితంగా పురపాలన చేస్తున్నానన్న మంచిపేరు గాలికి కొట్టుకుపోయి, అవినీతి ఆరోపణలపై దర్యాప్తు చేయించు అనే పరిస్థితి దాపురించింది. అప్పటికీ, ఈనాటి ముఖ్యమంత్రికి పాదపూజ చేసి వస్తూనే వున్నారు; కావమరదులు రాజధానిలో ఎప్పటికప్పుడు లైన్ క్లియర్ చేసి వస్తూనే వున్నారు అయినా ఆయనతోటి వుండడానికి కౌన్సిలర్లు భయపడి పారిపోతున్నారంటే లోపం ఎక్కడవుంది?

రమేష్ రెడ్డి రాజకీయాలపట్ల నాకు ఏంత లేదు. కాని, ఆ పెద్దమనిషి పత్రికం వాళ్ళని కూడా కల్పి బండబూతులు తిట్టుంటే ఎందుకు సహించాలి? చెప్పుతో కొట్టి సారీచెప్పడం ఆయనకు మొదటినుంచి అలవాటే. చేర్మన్ అయిన కొత్తలోనే ఈనాడు విలేఖరిని కూలనాడాడు; అమర్య ఒకసారి కౌన్సిల్ సమావేశంలోనే ఆంధ్రభూమి విలేఖరిపై చేయి ఎత్తాడు. ఇప్పుడుపదిమందిఎదుటఉదయందినపత్రికా విలేఖరిని అసభ్య పదజాలంతో దూషించాడు. ఆ తర్వాత పాత్రికేయులందరూ కలిసివెళ్ళి ఇదేమిటని నిగ్గదీస్తే. దేనామాట అననేలేదు పొమ్మన్నాడట.

పత్రికావార్తలపట్ల ఇంత అసహనం ప్రదర్శించే రాజకీయవాదులను ప్రజలు క్షమించినా పత్రికలు క్షమించలేవు.

అనుచరులను శత్రువులుగా మార్చుకునే కళలో నిష్ణాతుడౌతున్న రమేష్‌రెడ్డి ప్రత్యేకతలు ఏనాడైనా ఎన్టీ రామారావు దగ్గర తనకున్నచనువును, ప్రస్తుత ముఖ్యమంత్రి దగ్గర లైన్ క్లియర్ చేసే బంధుత్వాన్ని టౌన్ అభివృద్ధికి, నిధులు రాబట్టుకోవడానికి వాడివుంటే రమేష్‌రెడ్డి నెల్లూరులో పెద్ద రాజకీయశక్తిగా ఎదిగి వుండేవాడు; వాటిని భస్మాసురవరాలుగా మార్చుకొని తన రాజకీయ సమాధిని తానే నిర్మించుకోవడాని ఆయన ఉత్సాహపడితే ఎవరూ అభ్యంతర పెట్టరు. ★

## మనోవర్తి

(3 వ పేజీ తరువాత)

కోర్టు తీర్పుయిచ్చిన ప్రకారం తనకు నెలకు రూ 750 లు చాలదని, దానిని రెండువేలుగా పెంచమని శ్రీనివాసులుకూడా హైకోర్టుకు విన్నవించుకున్నాడు. ఇద్దరి అప్పీళ్ళను న్యాయమూర్తి కె. వెంకటస్వామి త్రోసిపుచ్చుతూ, సివిల్‌కోర్టుతీర్పు ప్రకారం పద్మప్రియ తన భర్తకు ప్రతినెలా రూ 750 లు మనోవర్తి చెల్లించాలని ఆదేశించారు.

## అర్చన

(8 వ పేజీ తరువాత)

బాలకృష్ణ, రాజేంద్రప్రసాద్, మోహన్‌బాబు ప్రచారం చేశారు. రాజకీయ ప్రచారాల ప్రభావం తమ చిత్రాలపై అంతో ఇంతో వుంటుందిగనుక తమ నిర్మాతలకు ఇబ్బందికల్గకుండావుండేందుకు ఈనిర్ణయం తీసుకున్నట్లు బాలకృష్ణ చెప్తున్నాడు. రాజేంద్రప్రసాద్ మేనెలలో అమెరికా వెళ్తున్నాడు. మోహన్‌బాబు నిజంగా "అన్నగారి ప్రచారం రాలదా!" అంటున్నారు కొందరు తెలుగుదేశం' సానుభూతి పరులు. ★

## చిత్రసమీక్ష

(8 వ పేజీ తరువాత)

చూచిన ప్రేక్షకులు స్పృహ కోల్పోకుండా వుండగలరా! అసలు ఇన్ని హత్యలు చెయ్యటానికి దాసరి మనసు ఎలా అంగీకరించింది. హత్యలు తప్ప ఈ చిత్రంలో చూడతగింది ఏమీలేదు. చిత్రంలోని దృశ్యాలన్నీ విపరీతధోరణలో అతిగా కనిపిస్తాయి. దాసరిలాగా హత్యలు, రక్తపాతం సహించే ప్రేక్షకులు ఈ చిత్రం చూడగలరు.

పుండరీకాక్షయ్య, రామిరెడ్డి, వినోద్‌కుమార్, శారదా నటనగూడా అతిగానే కనిపిస్తుంది మాటల్లో చురుకుదనం కనిపించదు. పి యస్ ప్రకాష్ ఛాయాగ్రహణం బాగుంది. ★


## ఐస్‌ఫ్యాక్టరీ అమ్మబడును

ఫోన్ : వల్లూరు - 47

ముత్తుకూరుకు పోవు మార్గంలో మంచి రన్నింగ్ కండిషన్‌లో గల 3 టన్నుల (రోజుకి) ఐస్ ఫ్యాక్టరీ అమ్మకమునకు కలదు. కావలసినవారు సంప్రదించండి-

ప్రగతి ఐస్ ఫ్యాక్టరి
కప్పలదొరువు గ్రామం
ముత్తుకూరు మండలం - నెల్లూరు జిల్లా

అన్నిరకాల మందులు, పెటిరసరి, కాస్మెటిక్స్, సరసమైన ధరలకు లభించును. విచ్చేయండి!

వివేకా మెడికల్స్
హిగతోట సెంటర్
ట్రంకురోడ్డు-నెల్లూరు
ఫోన్ : 27691 రెసి: 24861


## విజయవాడ అ॥ డి॥ ము॥ కోర్టులో

ఓ. పి. నెం 19/91 డి.వి పుష్పాంజలి అనే రజ్యా పుష్పాంజలి -పిటిషనర్
మరియు లేరు -రెస్పాండెంట్

ఈ నెంబరు పిటీషన్ లేటు రజ్యా ప్రసాదరావు 9-5-87 తేదీన సర్వీసులో యున్న కారణముగా వారికి కాకినాడ రెప్రసీ కంట్రోల్ యూనిట్ గారివద్ద నుంచి రావలసిన 50 000 (అక్షరములా ఏభైవేల రూపాయలు) భార్యయైన నాకు అనగా పిటిషనర్‌కు చెందవలసినదిగా కోరుతూ సక్సెషన్ సర్టిఫికేట్‌ను ఇప్పించమని పై నెంబరు ఓ పి 19/91 దాఖలు చేయగా పబ్లికేషన్‌ద్వారా జనరల్‌నోటీసు నిమిత్తము 26-6-91 తేదికి వాయిదా వేయబడినది కావున ఎవరికైన ఆక్షేపణ వున్నయెడల వాయిదారోజు పగలు 10-30 గంటలకు పై కోర్టువారి యెదుట హాజరై మీకుగల ఆక్షేపణలు తెలుపుకోగలరు. లేనిచో పరోక్షమున ఎక్స్‌పార్టీ ఆర్డర్ జారీచేయబడును.

-కె యస్ రాజు, కె సమత-అడ్వొకేట్స్


## రైసుమిల్లు లీజుకివ్వబడును

1) మాదరాజుగూడూరులో గల రైసు మిల్లు లీజుకు ఇవ్వబడును
2) 25 H P. Motor complete set విక్రయమునకు కావలెను
3) రష్యన్ D T.14 ట్రాక్టరు ఇంజను విక్రయమునకు వున్నది.

A. SRI IVASULUR. DDY
No 415 Ist cross
III Phase-III Stage
V th block Bhanashankari
Bangalcre-560 085

NLR 26706
IR 36
వరి విత్తనములు మావద్ద వున్నవి.
కావలసినవారు:
మందిపాటి గోపాలరెడ్డి
కాకుపల్లి

CROWN-TV
With Technical assistance from NEC Japan
CARRINA
అథరైజ్డ్ డీలర్: నెల్లూరు, ప్రకాశం జిల్లాలకు
స్టీరియో సౌండ్
ఇండియన్ బ్యాంక్ ఎదురుగా ట్రంక్‌రోడ్, నెల్లూరు
ఫోన్: 5428

Celebrate Marriage with Colourful New Varieties of Gents ready made garments.
ఫోన్: 25420(R)25430
విమల్ జంక్షన్
జెంట్స్ రెడిమేడ్ షోరూం
సూటింగ్స్&షర్టింగ్స్

ప్రభుత్వ ఉద్యోగులకు సులభవాయిదాలలో
OPTONICA
SHARPLINE
ఎ ఎలక్ట్రానిక్స్ & ఎలక్ట్రానిక్స్

గజానికి ఒక గాంధారి కొడుకు తయారవుతున్న యీ గాంధీగారి దేశంలో

నిస్వార్థ, నిష్కపట, నిష్కల్మష హృదయంగల మనుషులు రాజకీయాలలో అరుదు

"సొంతలాభం కొంతమాని పొరుగువానికి తోడ్పడడానికి" ప్రజలమధ్యకు వచ్చిన

మా ఆప్తుడు

# శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి కి

ఈ ఎన్నికలలో ఘనవిజయం కలగాలి.

ఒంగోలు నియోజకవర్గం ప్రజానీకం

అసలు సిసలు "ప్రజాసేవ"ను చవిచూడాలి.

సమ్‌థింగ్ స్పెషల్
నెల్లూరు

శ్రీశక్తి ఆగ్రో ఆయిల్స్ ప్రై. లి.
నెల్లూరు

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press-Nellore.